బులుబాగావింటది - వేదశాస్త్రములు విదితంబంటది - మునమున గురునకు మొక్కుమటంటే - వదరకుమనుచును గదరటు బడలేది ॥ మన ॥ వల్లదనములకు బంటునుయుంటది - బొల్లుకూతలునా పుట్టిల్లంటది - యెల్లలోకములు యేలేనంటది - పల్లెలునంటది పట్నములంటది - చల్లగనద్గురు సామనుమంటే చల్లనిమాటది - నాచవి చొరదంటది ॥ మన ॥ కులగోత్రంబులు గొప్పనియుంటది - కలిమి బలంబులు ఘనమనియుంటది - యిలభోగంబులు యిష్టంబంటది - చలాచలములు శాశ్వతమంటది - పలుమరు పోలూరి పాపయార్యుడును బయలని బ్రహ్మము పలుకుమటంటే పనిలేదని నేపలుకనటంటది ॥ మనసూ ॥

## 2. తత్త్వము.

మంచిమందు మనకుదొరికెనే - సంచితకర్మ త్రుంచివేశేమందు దొరికెనే॥ మంచిమందు మనకుదొరికె - మరణజనన మనెటివ్యాధి కొంచెమూలాపూనుకోరకు యంచరాని యచలమైన ॥ మంచి ॥ యూపశాస్త్రములాను భేషజములుపలికిరాగ ద్వేషమూల పెనుగుచున్న దోషరహితమైనమందు ॥ మంచి ॥ కాయమనెటికల్వమూలో - కర్మధర్మమూలునన్ని పాయకాను నెక్కుడుఘామ పక్వమూగనూరినట్టి ॥ మంచి ॥ సృష్టిలోపలాను యున్న దృష్టిదృశ్యమూలునన్ని నష్టమనుచు బోధజేశె శ్రేష్ఠుడైనగురునివలన ॥ మంచి ॥ తోలుతిత్తిలోనుయేమి - మేలులేదనను నుదీని కీలుదెలిసితేనుమందు బోల్లుఘటములెత్తకుండ ॥ మంచి ॥ గురుతుగానువారశించా గురుని శేవజేసినపుడె - ధరణి పాపయార్యునకును తరుగులేని తత్త్వమనెటి ॥ మంచి ॥

## ౩. తత్వము.

అంతానదియెనుమీా - యీాజగమంతట గురుడెనుమీా ॥ అం తానదిన్నై యచలరూపమున యింతంతనకను యెటునటుజూనిన - ॥ అం ॥ బయలుకో బయలైనుమీా - బ్రహ్మము - నిర్భయులనిగను గోనుమీా - పాయకగురుచే భావముదెలశితే - రేయుబగలునొకరీతి గవెలుగుచు ॥ అంతా॥ వింతలుజూయనిది - యే యే చింతలునొంద నిదీ - సంతతముగురు చంతనుజేరిల భ్రాంతులుకోశిన ప్రాజ్ఞులకెల్ల ను ॥అంతా ॥ చిత్తముస్థిలిపినను - ఆత్మావేత్తులునై తేనూ ప్రత్తది ఎరుకని వ్రూహానెరిగినను - సత్తుచిత్తునకు సర్వముతానై ॥ అంతా ॥ లోకమునంతటనూ - పకటిగలోపల వెలుపలనూ - ఏకముగామరి యేమియునంటక సకలలోకములు సచరాచరములు ॥అంతా ॥ సుర లుమునిందుభులూ - భూసురులును ఖేచరులూ - నరులును గిరులు ను - నానామృగములు సురాసురిలును సోమభాస్కరులు ॥ అంతా॥ ఆకునుఅంటకను నదియు పోకనహొంపకనూ - రాకపోకడ లేకను యెప్పుడు - ఆకాశంబున కతీతముగుచునం ॥అంతా॥ క్షరమనియును కోక - అల్లది అక్షరమునబాకా - క్షరవరం క్షరములు సాక్షియుగా దని - స్థిరముగ శివరామ దీక్షితులన్నది ॥ అంతా ॥ పరులనెమాట లు వినుచూ - మనసున మంచియుండకిదియనువూ - పరశురామునీ నరశింహాగురుడీ - భావముదెలపిన పాపయాఖ్యునకు ॥ అంతా ॥

## ౪. తత్వము.

వ్యవసాయమునుశాయరా - సంసారి నీవ్రూ వ్యవసాయముసు శాయరా ॥ వ్యవసాయమూనూశాయూ యెరూకానేచేనూ తీసుక నవరించి చేనూబాపటం చక్కాగాద న్నూకోని ॥ వ్యవ ॥ మూనా

సాబుద్ధూలానే మంచీయెద్దులకట్టూకోనీ జ్ఞానామానేనాగలిపెట్టి వూ
నీనా కర్మామూతేగా ॥ వ్యవ ॥ దుక్కూలూ దంచాకానూ -
ముక్కూకూచాయాగానూ - యెక్కడీ కక్కాడీకీ చక్కాగాచా
లూజూచీ ॥ వ్యవ ॥ వరెక్కోట్టూ మనసూనిపుడు కర్రాదెబ్బాలా
తోకొట్టి బిరాగా పగ్గముబట్టి అర్రేనీమళ్లేసూకా ॥ వ్యవ ॥ గు
రుకీలకామూనెవక్క గొర్రాచేలోకట్టూకోనీ - అరిషడ్వర్గామూలా
ని - అకూ అలుమూ తీసీవేశీ ॥ వ్యవ ॥ ధీరూడావరుచూ మదుపా
నే వేరూవెంపలి వేరీవేశీ - తారాకాసాంఖ్యామూనే పైరైనావిత్తు
నామిాడీ ॥ వ్యవ ॥ పాపాపుణ్యా మనుచూనుండే పైరూలోక ప్రాజ్ఞు
డవైతే రూపామూనేదీమంచీ పాపాగామూ గట్టూకోని ॥ వ్యవ ॥
ధ్యానామూనేదీమంచీ - వాశీగాలా కొంకవలి తీసుక - అజ్ఞానామూనే
జొన్నాకోశీ దుర్గుణములన్ని కుప్పావేశీ ॥ వ్యవ ॥ మంకూబుద్ధూ
లానేనూ కంకూలన్నికోశీపోసీ - మంకాకొమ్ముల యెనిమిాదెద్దుల
శంకాలేకా నూరిపిడిజేశీ ॥ వ్యవ ॥ హంసానే చాటూతోనూ ఆగా
మాసంచితమూలన్ని తూరూపారాబోశీ ఆనందాపదవీజెందీ ॥ వ్యవ ॥
ముత్యాలూ పొగడాలావంటీ నిత్యామైనా జ్ఞానాలన్ని సత్యామ
నునూం పోగూజేశీ తిత్తీలో బోసూకోని ॥ వ్యవ ॥ కోట్లామిా
డానూయున్నా కోటీలోనూ దంచీదంచీ - బూటకమనే కడుగు
ప్రావంచి మేలైనా మెలికాలూడదీశీ ॥ వ్యవ ॥ తపవూశాయూకా
నూనీవూ్ర అడుగూలేసి భాండవలోనూ - గడియూ గడియకు కలి
యూతీశీ కలిపెళా శబ్దామూవినుచూ ॥ వ్యవ ॥ పరశూరామూనా
రాశింహ పరమాగురునీ శేవాజేశీ పరపాపాయోగి వగుచూ గురు
ప్రసాదామేతినచూ ॥ వ్యవసాయూమూనూశాయరా

## 5. తత్వము.

సాలేవారము పద్మాసాలేవారమూ - మేమూ సాలేవారమూ గురునికిచాలేవారమూ - సాలేవారము సద్గురుకరుణను మూలముచే భృగుమునిసంతతికుల ॥ సాలే ॥ తర్కవాదములు పెక్కుశాస్త్రములు మార్కండేయులు మర్మముదెలిసిన ॥ సాలే ॥ భావాభావము భావాతీతము - భావనఋషియని బాగుగగొల్చిన ॥ సాలే ॥ సాకారంబను పేకలుదెచ్చుక - లోకలోకములు లాకలుజేసిన ॥ సాలే ॥ ఉపమనిమెఢివక ఊడితెకట్టుక చపలచిత్తము - చెండి నైచినఘన ॥ సాలే ॥ దిక్కుదిక్కులను దొక్కనజేసుక యెక్కుబేట్టి కనుటెత్తిచూచినఘన ॥ సాలే ॥ పంచభూతములు పంచకోశములు - కుంచగజేసుక కచ్చులుదడిపిన ॥ సాలే ॥ యెక్కువమనసును చిక్కబట్టుకొని చక్కగసరిమేమెతుకవజేసిన ॥ సాలే ॥ యిరువదియొక వెయ్యారునూరులును - తరచుగ అచ్చున తంతూల తిన ॥ సాలే ॥ కంటికిమింటికి గెంటికినడుమను అంటి అంటనిఘన యింటిలోనేసిన ॥ సాలే ॥ అండమెపలకయు పిండమెదోనెయు బ్రిహ్మాండమె నాడెగ సమరగనేసిన ॥ సాలే ॥ మోహంబనియెటి మోకను బట్టుక సోహంభావమున సొంపుగజుట్టిన ॥ సాలే ॥ విడువక పెడగోల తడబడితిరుగగ - వడిగను బట్టుక పగ్గముసేసిన ॥ సాలే ॥ నూతికినడుమను నాతికిమీదను కోతులబట్టుక జ్యోతినిజూచిన ॥ సాలే ॥ నేత్రములొంచుక శాస్త్రవాసనలు సూత్రములనుచును సూటిగజూచిన ॥ సాలే ॥ కుటిలంబనియెటి గుబ్బకొయ్యలను తటునసబట్టుక దాసోహంబను ॥ సాలే ॥ తుంటరిబుద్ధులు తొగరనిబట్టుక అంటిఅంటని ఘనపంటికిమెలిచిన ॥ సాలే ॥ ముండిగుణములను కండెలుజుట్టిన కుంపలిఘిరతెలం నింపిగనేశిసఘు ॥ సాలే ॥ గిండతేసిగును

అండనుజేపుక పండువెన్నెలలో నిండగనేశిన ॥ సాలే ॥ పంచవింశతీ బహుతత్వంబుల పచ్చమునేశీ పరమాత్ముని కిచ్చిన ॥ సాలే ॥ పరశురామునీ నరసింహగురునీ చరణాబ్జంబులు సారెకుతలచిన ॥ సాలేవారము॥

## 6. తత్వము.

రాముడానే దేముడున్నాడు - యీదేహమూలో, యీతనువుయందూ, యీఘటములో, శ్రీరాముడానే దేముడున్నాడు ॥ రాముడానే దేముడున్నడు సామినరసా గురునికరుణను దేమునీ గనుగొన్నవారికి దేముడయ్యె యెదుటనెప్పుడు ॥ రాము ॥ కోపతాపముమానుమన్నాడూ - మానితే యీమా రూపమింకను లేదనన్నాడూ - కోపతాపము మానిగురునీ - చూపుజూచేవారికెల్లను రూపనామా కళలులేకా రూపమయ్యెయెదుటనిలచీ ॥ రాము ॥ అండమె పిండాండమన్నాడూ - యీరెండుదెలిసితె బ్రహ్మాండమే నిండుందునన్నాడు - అండ పిండామూలుగడచీ ఖండఖండామూలుదెలసీ - దండియోగూలైనవారీ అండబాయక కొండవలెనే ॥ రాము ॥ గుట్టుదెలిపె గురుడుయితడెగా - యీజగముగెల్లను పట్టిదనుచును ఘట్టిపరచేగా - గుట్టుదెలిపీ గురుడుబోధను ఘట్టిజేసీ యిట్టిదనుచును - అట్టిదిట్టిదనగరాకను - పట్టిబట్టాబయలుబయలై ॥ రాము ॥ యీడుజోడును లేకయున్నాడు - సకలములోను కూడియాడీ పాడుచున్నాదు - యీడుజోడును లేకనిరతము - వాడవాడల యీడజూదిన రాడుపోడూ లేదునకను జూడచూడగ వాడువాడై ॥ రాము ॥ యిందునందని ననగరాకానూ - యెందెందుజూచిన ముందువెనుకని తెలియబడకానూ - యిందునందని ననగరాకను - బిందునాదూ కళలులేకను - అందిపొందారాక సకలము - నందుగొందూలానునిం

డీ ॥ రాము ॥ చిక్కులెల్లను బాయునన్నాడూ - సద్గురునిసేవా - నిక్కముగనూ జేయుమన్నాడూ - చిక్కులెల్లను బాపెగురునీ చక్కగాసేవించనేరక ధిక్కరించీపలికెజనులను - మెక్కువిరచీ బొక్కబెట్టును ॥ రాము ॥ కాసువీసము జాయడన్నాడూ - యీదేహమ్మైతే దోషమూలూజేసునన్నాడూ - వాసిగాపోలూలి పాపనదాసు మదిరంజిల్లజేసిన - దేశికుని నమ్మిన్నవారికి మోసమేమియు లేమనను చును ॥ రాముడానే దేముడున్నాడూ ॥

## 7. బూజంబంతి పాట.

యవ్వారేయీరాజయోగి యవ్వారోయమ్మా - దివ్యాసుందరమైనా కారణ దేశికులోయమ్మా ॥ యవ్వా ॥ మోహాలలన వివాహామున్కొచ్చిన ముఖ్యాలెవ్వారే- రహాకులైన శ్రీగురురాయులుగారటవె ॥ యవ్వా ॥ గురుశేషామన బువ్వముబంతికి గోప్యాలెవ్వారే - స్థిరభక్తికలిగున్నా మంచీధీరులుగారటవే ॥ యవ్వా ॥ పిండాబ్రహ్మాండాములు పీటలుజేశిన ప్రియులూయవ్వారే - ఖండాఖండామూలూతెలిపె ఘనులగారటవె ॥ యవ్వా ॥ త్రివిధాదీక్షలు వీస్తళ్ళేశే ధీరులుయవ్వారే- అవిరాళాముగ బోధాతెలిపే ఆర్యులుగారటవె ॥ యవ్వా ॥ పంచావింశతి తత్వామరాలూ పచ్చళ్ళమర్చిన భక్తూడెవ్వారే- పంచామృతాద్రిలు శోధనజేసిన పరముడుగాడటనే ॥ యవ్వా ॥ యిగుహాకూరలు ఆహాజేశే విబుధూలెవ్వారే- తెగువాతోయీ జగమూలేదనె జగధీశుడు గాడటవే ॥ యవ్వా ॥ తాపత్రియములు పులుసోడ్డించిన దాతలుయవ్వారే - ప్రాపూదాపూలేనిదితెలిపీ ప్రాజ్ఞులుగారటనే ॥ యవ్వా ॥ పడియూముూ లప్పా

ఢామరాలూ వడలూ అతిరసాలూ నాడూలూగాజేసి వడ్డించిన నా
ణ్యాలెవ్వారే ॥ యవ్వా ॥ పాపారహితా మానేకంచీ సూపామొ
డ్డించీ - ఆపోజ్యోతిని చూచీనిలిచిన అనుభవులెవ్వారె ॥ యవ్వా ॥
ముదమూతో పడుచకాద్రిదొప్పలు ముందారానునచీ - వేదాసారా
తీతాఘృతమందుంచిన విభులెవరె ॥ యవ్వా ॥ ఫలసంగారహితా
మైనా పాయసమొడ్డించీ - తాపాత్రయమనె తైరొడ్డించిన దాతా
యవ్వారె ॥ యవ్వా ॥ వస్తూ పోతూ నుండే భ్రాంతుల హస్తాము
లు కడిగించీ - సుస్థిరా తాంబూలాలీచ్చిన సోహంభావూలెవ్వారె
॥ యవ్వా ॥ వాసానాత్రయ మూలానెల్లను వదిలినవారెవరె -
యీషాణాత్రయమూలూమీరిన వేదాంతియుగాడటవే ॥ యవ్వా ॥
పంచాకళలా మించిన తెలివిని కాంచినదెవ్వారే - సంచీతామూలె
ల్లాద్రుంచే సద్గురుడూగాడటవే ॥ యవ్వా ॥ సర్వామూ రోశీవిడచిన
సరసూ లెవ్వారే - నిర్వికల్ప సామాధీనున్నా నియతడు గాడటవే
॥ యవ్వా ॥ ంఖలపైజన్మామూలూ యెత్తినందూకూ - అలసుమఫా
లా భాగామందూ నాలాలామూమూనూచూ ॥ యవ్వా ॥ దేహాదీ
ప్రపంచామెల్లా దేమూడానూచూ - సోహంభావా మందూనిలచిన
శూరుడుగాడటవే ॥ యవ్వా ॥ ఋణావమరాబంతికి పూతాపహాపు
బుధులూయవ్వారే - ముర్వేటీ కాలువలందూ నిలచిన మరాముక్తు
డుగాడటవే ॥ యవ్వా ॥ సర్వామరాకోశీవిడచిన సరసూలెవ్వారే -
నిర్వికల్పసామాధినినిలిచిన నిజగురుడీతడౌనె ॥ యవ్వా ॥ పరశూరా
మా సరసాగురునీ పాదములొత్తూచూ - పరిపూర్ణానుభవమెరిగీ వారీ
పంచనునిలచూచూ ॥ యవ్వా ॥ అనుభావార్థామయినాపాటా భక్తి
వలుపురుషూలూ - ఆనందామునపాడితె అష్టైశ్వర్యా మందేరూ

॥ యవ్వా

## ౮. కోట్నాల పాట.

సువ్వీ సువ్వాలె - ముక్తి కాంత పెండ్లికొచ్చి భక్తజనము లందరూను శక్తికొలది గురునిమంచి - యుక్తులడిగిరీ ॥ సువ్వీ ॥ కూటమైనసంపలోన కోట్నములు దంచుదాము - సూటిగ్గానైనమహావాక్య పాటబాడరె ॥ సువ్వీ ॥ పంచకన్యలై దుగూరు భావమందునిలచి మీరు నంచితేనె కొలనులోను ముంచులాడరె ॥ సువ్వీ ॥ వేదపూరకుంభవన్ను సూచకంబులనెటివన్ను ఖేచరీముద్రమీరు చూదిదంచరే ॥ సువ్వీ ॥ అష్టపాశములవన్ను అష్టమూదములవన్ను అష్టతనువూలవన్ను ఆశవన్నును ॥ సువ్వీ ॥ రాకపోకలనెటివన్ను లోకలోకమువిధమున ద్లు ఆకాశాదిభూత మూలనేటివన్నునూ ॥ సువ్వీ ॥ హంసయనెటికోకలీని ఆమరగానుపట్టుకొని హింసలెల్ల బాసినట్టి యువిదలంతా ॥సు॥ సంకులంబులవిడూచన్ను శంకలేకదంచిరూను పంకజాముఖులమీరు సంకుజరగరె ॥ సువ్వీ ॥ మౌనమేమిలేషమీరు రాశివక్కటికజేసి భానురముగ సచలమందు భక్తినిలువరె ॥ సువ్వీ ॥ షట్చక్రభ్రమల చాతమీరు పట్టుబడియు చడనెప్పుడు బట్టబయలె బ్రహ్మమన్న గుట్టు చెలియరె ॥ సువ్వీ ॥ కర్మధర్మములు లేని నిర్మలంబై నయాత్మ మర్మమెల్ల తెలిసుకుని ధర్మమెరుగరె ॥ సువ్వీ ॥ రానిదానిపోనిదాని కానిదానిలేనిదాని హానివృద్ధులేమిలేని అచలమెరుగరె ॥ సువ్వీ ॥ యిందుమూర్తులంటిజగము లెల్లకోశవిడచిమూ ఖండమైన నరసగురువి యందచేరరె ॥ సువ్వీసువ్వాలతే ॥

## ౯. జోల పాట.

చివ్వో ॥ పాలయూనీబాగా చిచ్చిగొట్టరె - మానాబుచ్చిరామూలా చిన్చియూచారే ॥ చివ్వో ॥ మెచ్చినా తొట్లకూ మంచీ కమ్మాలా చాందిరికట్టి - ముచ్చాటా దిరాగానూ మునితాలంచా

రుమీరూ ॥ చిచ్చో ॥ యక్కాడీనుంచో వక్కాతుక్కావచ్చీ దు
ష్టాజనులా పిక్కాబట్టి పీకేనానీ చక్కానీస్వామీతో జెప్పీ ॥చిచ్చో॥
కన్నూలానడుమానూ మంచీ నన్నాపూదిడ్డీలోనూ పున్నామాచం
దూ్రనిజూచీ పాలతూలందాకుగూడీ ॥ చిచ్చో ॥ మాయాలోమా
యూదెల్పే మద్దూరూశేవాజేశీ - బయలూలో బయలూదెలశీ భా
మాలందారూవచ్చీ ॥ చిచ్చో ॥ వరుసాగాపోలూరీపురీ వరపాపాదా
నూడాదీ సరసాభక్తూనేలూ స్వామీని పొగడూచు నైవుమా
॥ చిచ్చో ॥

## 10. మేలుకొలుపు.

తెల్లవారివచ్చె తెలిపీగాభక్తూలూ శేవాశాయనువచ్చె లే
రా - కల్లగాదు సమీకన్నూలానడమను కవలామూవికసిం
చె లేరా ॥ తె ॥ ముక్కూమీదనుయున్నా చుక్కాగనుపించానూ
చక్కానీనాస్వామీ లేరా - ఉక్కీలీమనపూచే మొక్కీనావరమి
చ్చీ - మక్కూవాదీక్తూవూ లేరా ॥ తె ॥ ముదామ్రిలాలోపాలా
మూలామూదెలిపేటీ - చిద్రూపూడపునీవూ లేరా - నిద్రలాలో
యోగా నిద్రాసూయెరుకాచే - భద్రాపారతుగాని లేరా ॥ తె ॥
ఆధారాముననాల్గు దళమూగాపైనానూ - వ శ ష స వర్నములేరా
హాంసాలూ ఆడ్నూరూ ఆడూచూమున్నావీ - అధిపాతీగణపాతీ లేరా
॥ తె॥ స్వాధిష్టాచకా్రనా షడ్దాళంభులమీద- బ భ మా యా ర ల
లుండు లేరా - ఆర్వేలాహంసాలు ఆడూచూనున్నావీ అధికారీవీ
ధాత లేరా ॥ తె ॥ మణిపూర్వాకమునందూ మరిపాదీదళమూలూ
డ ఢ ణా దిఫాంతాములేరా - అందూనా ఆర్వేల్లూ హాంసాలుఆడూ
నూ అదా్రిహరీహరీ లేరా ॥ తె ॥ అనహాతాచకా్రమూ నందూద
ళములు పన్నెండాకాదీతాంతామూ లేరా - అరలేకా ఆర్వేలాహం

సాలాడించే - అపార్వతీశ్వరా లేరా ॥ తె ॥ సొంపుగావిశుద్ధ షోడశాదళమునా షోడశా వర్ణాముల్ ల్లేరా - పదినూర్లాహం సాలూ పట్టుగానాడించే - పతియైనజీవాత్మా లేరా ॥ తె ॥ విది తామతానాజ్ఞయా ద్విదళాచక్రంబునా పతియైనా పరమాత్మా లేరా - హంతసోమన్తాలనియేటి అక్షరంబులువెయ్యి - హంసాలూ యుండునూ లేరా ॥ తె ॥ అనేకాసహస్ర అపద్మామందూనా అష్టాదాళములుండు లేరా - హంసాలూనశశాతం బాడూచూను న్నావీ - అభిమానీసద్గురుడ లేరా ॥ తె ॥ వసుసాగా పోలూరి వర పాపాయాఖ్యానూ శరణనీ మొక్కేను లేరా - శరణూజొచ్చిన నా నీ కరుణించావలెనేమా - ఘనమాదయాకర లేరా ॥ తెల్లావారవచ్చే ॥

## 11. మేలుకొలుపు.

మేలుకొను సద్గురుడయిప్పుడు మేలుకొనుసర్వాత్మకా - మేలుకొనులోకాధిపతివి మేలుకొనవే ॥ అండబాయక నిన్నుయెప్పుడు మండలంబులు మూడుదాటియు పండువెన్నెలజూచినట్టి భక్తులొచ్చెక ॥ మేలు ॥ కంటిమింటికి గంటినమూను అంటిఅంటని యుంటిలోపల దంటనాదము వినుచున్నా - ధన్యులొచ్చెక ॥ మేలు ॥ ముద్రలన్నియు మార్గాలకోరిగెను నిద్రలన్నియు నిలచిపోయెను - నిటలమందున చూపునిలచెను యెరుకేసుచెక ॥ మేలు ॥ మూడుమీాదను మోదమలరగ కోడిగూశెను తెల్లవారెను - మేరుగొండల మీాద మేడలో వెలసియున్నాస్వామీ ! మేలు ॥ మాయఘటములు మంటగలసెను - మాయలెల్లను మాయమాయను - బయలులోపల బయలుదెలసెను బంధమ్మొదిలెక ॥ మేలు ॥ అశ్వత్థమునొలగిపాయును - ఆత్మరూపము దెలియుటాయెను - అచలభావము నిలుకడాయెను - అనుభవమునా ॥ మేలు ॥ చిత్తమేమోనిలచిపాయెను చీకటి

ల్లాబాసిపాయను - వృత్తి బట్టా బయలు దెలసెగా పృథ్విలో నా॥ మే
లు॥ వాదభేదము వదలిపోయెను - వాదివరుసలు తేకపోయెను - కద
ల మొదలక యున్న అచలము - కానుపించెగా ॥ మేలు ॥ లోకలోక
ముక్కల్లలాయెను లోను బయటను యేకమాయెను - ఆకళములకూ
మిక్కిలైనది అచలమాయెగా ॥ మేలు ॥ పరశురామా నరహరుడా
పరమపదము వదమురా బయలు జేసిన - పరుసవావనయోగికిప్పుడు పర
మాలివ్వగా ॥ మేలుకొనవే ॥

## 12. తత్వము.

యేకాదశుండేరు నరులూ - ఆత్మా ఆకాశామెరుగరీ నరులూ
యేకాదశుండేరా యేకస్వరూపమై రాకపోకలు లేని షకాత్మ నెరుగ
కను ॥ యేకా ॥ వప్పగావేలాలు వుప్పుడూశనగలూ చప్పరించుకొవ
విరి నర్ధతీసేన లేక ॥ యేకా ॥ అటుకులూ బెల్లమురా పాటుకు పాటుకు
న్న నవిలి తటుకునను పరమాత్మ దారి దెలియూలేక ॥ యేకా ॥ కొల్ల
గాపిండింత చల్లలోజోసుకుని వుల్లపూరాగాయ వుచ్చుకొనిజనం బెల్ల
॥ యేకా ॥ పెసలు బియ్యము కలియవోసుకొని పొంగ్గాజేసుకొని
నెయ్యింత వేసుకొని భోంచేసి ॥ యేకా ॥ మరునగా పోలూరి వరదా
యోగివరు నరసింహా గురుపూజ నమ్మి చెయ్యాలేక ॥ యేకా ॥

## 13. తత్వము.

యేకాదశినేనుంటినమ్మా అమ్మమ్మలారా యేకాదశినేనుం
టినమ్మా ॥ యేకాదశినేనుంటినమ్మా యెరుకామరువూలానూమీ
రి ఆశాశాతీతామై అంతాటానిండీయున్నా ॥ యే ॥ కాయామూనే
యింటిలోనూ కనవుపారాజమ్మూకోసి న్యాయమూనే శుద్ధజేసీ
పాయాకాముగ్గూలూ బెట్టీ ॥ యే ॥ కామాక్రోధా లోభమోహా
మూదామత్సరామూలన్నీ నామారూపామూలేని గుణమైనా సాజ్జశే

సుక ॥ యే ॥ పంచాభూతామూర్తై దు పంచకోశామూర్తైదూ పం చేంద్రియంభూలన్నీ పచ్చాడీజేసూకోనీ ॥ యే ॥ పరశురామా నా రాసింహా పరమగురునీ శేవాజేపీ వరపాపాయోగీనగుచూ గురుపాద్ సాధాషేతిస్తుచూ ॥ యేకా ॥

## 14. తత్వము.

దుడుకూ పెండ్లామే భూతమురా - యింట్లోయెవ్వుడూ జేయుచునుండూ నిత్యాజగడమురా ॥ భూతమురా భూతము రా భూతమురా దయ్యమురా ॥ దుడు ॥ తనభూపాణము లెల్లాదీ సూ చాలాపనియున్నాదని తానా వుట్టిల్లూజేర్చా -ధనధాన్యాము లుతీసీ దాచూ దానీమనసూ శేషుకివాలే మరిబూసా లిడుచూ ॥ దుడు ॥ మొగనీజూచితె మూతీవిరచూ - యెంతోసొగసుగా తన వార్ని సొంపూగాజూచూ - పగచూపూ అత్తానూజూచూ - నీకూ తగదానీఅంటేనూ ధగధాగాలేచూ ॥ దుడు ॥ మరుదూలా బావా లాతిట్టూ అతివిరసము తోడీకోడండ్లానుకొట్టూ-మరజండ్ల వదినేలా నెట్టూ అత్తామావగాలాపై బడీ అరికాళ్ళమట్టూ ॥ దుడు ॥ అనువై నవస్తూవల్ పట్టూ తానా అన్నాదమ్ములకానీ అవిదాచీపెట్టూ-మన సూవచ్చినచోటాబెట్టూ దాని పెనిమిట్కైనె పొస్తే పెళపెళాదిట్టూ ॥ దుడు ॥ పెట్టెలోచీరేలూతీనూ తానూ కట్టూకాదేహామూ ఘన మానీమురసూ - మట్టూలేకనూతిరుగాజూచూ పట్టీకొట్టూబోయీతే వృతిమిప్పైబడజూచూ ॥ దుడు ॥ యింటీపనీకి పలుకాకుండూ - పొ రూగింటీపానికి బాగా పూనూకాయుండూ - గుట్టూతేలియ్యలేకా యుండూ ఆత్మాగుట్టూతెలివి నరసా గురునెరుగాకుండూ ॥ దుడు॥

## 15. తత్వము.

తనుచైనా రుచిగాలాపండూ పండూతరచీచూచితే చెట్టూ తలకాయూనుండూ - తరుగూ మారుగులేకాయుండూ పండూతాత్ప ర్యామెరిగితే తత్వామైయ్యుండూ ॥ తరు ॥ తరుగూ పెరుగులేకా యుండూ పండూ ఘురుగూపోరుగురెండూ యేకామైయ్యుండూ - అ రమూరాలేకాగానుండూ ఆది కొనవూకాలములేకాఘనమూగానుం డూ ॥ తరు ॥ సంచీతాములుబాపేపండూ పండూకంచీకాశా, స్త్రీకి మించీనావండూ - వంచానాలేకానూయుండూ దానికాంచీనావారికి కనకామైయ్యుండూ ॥ తరు ॥ సొగసైనారూపామూపండూ నిండూ పగలూరేయూనుక్కా పగిదీనెయుండూ - జగతీవరులకు గాకాయుం డూ పరమూ యోగూలాకెల్లానూ యెదుటానేయుండూ ॥ తరు ॥ తల్లాక్రిందుగాచెట్టూయుండూ దానాపల్లావాశాఖాలూ పనుపూగా నుండూ - తెల్లాగాపండీనావండూ ఆదియెల్లాలోకమునిండీ యేకా మైయ్యుండూ ॥ తరు ॥ పరులాకెల్లనూ బాహూదిక్కూ పండూవ రమూభక్తులవలలా పడిబాగాజిక్కూ - నరసింహా గురుచేతాదక్కూ దాన్నీ ధరపాపామ్లాఖ్యాదూ తరుచూగామెక్కూ ॥ తరు ॥

## 16. తత్వము.

పండాగోయమ్మా సంవత్సరాదీ పండాగోయమ్మా ॥ పం డాగోయమ్మయ్యా భక్తూలాకెల్లానూ దండిగా గురుపూజా ధరమెం దూజేశేటీ ॥ పండా ॥ ముక్తీగోరినవారా సక్తీతోగురుజేరీ భక్తీ తోడనుమంచీ యుక్తూలునడిగేటీ ॥ పండా ॥ నిబ్బారామతితోడా నెరుకానూమర్మావాకా గొబ్బారీవుడుకాలూ కొనరీభూజించేటీ ॥ పండా ॥ గురుపాదాతీర్థామూ గురునీప్రసాదామూ తనుచూగాభు జియించీ తత్వామూగనుగోనే ॥ పండా ॥ కాసీగాభక్తూలా రాసీ లోజేర్చూకా దోసీలాగ్గినవారీ దోషాములేబాపేటీ ॥ పండా ॥ పర

...మూలవారా నరశింహాగురుస్వామీ పరమాత్ముడనీ శేవా ...పాదారవిందములకే శే ॥ పండా ॥

## 17 తత్త్వము

యెక్కడ నుండొచ్చె । యీజీవచేతన్య మీలోకమున కిప్పుడు - టక్కుపిక్కులు లేనిటావునాదంటాడు చిక్కుచిక్కనిజగము చిక్కించుకుంటాడు - యెక్కడాచూచినా యేకమైయుంటాడు దిక్కుతెలియక తాను దుఃఖపడుతుంటాడు ॥ యె ॥ ముగ్గురూ సేరదార్ల మూలమైయుంటాడు యగ్గులేకను లోకమేలెనటంటాడు - తగ్గుగుణములచాత తడబడుచునుంటాడు ముగ్గురిల్లాండ్లకును మొగడనేనరటాడు ॥ యె ॥ మూడులోకములకు ముఖ్యాడనంటాడు యీడపింగళనడుమ వాడనాదంటాడు - జోడుపాములబట్టి ఆడింపుచుంటాడు కాదుగోలాలేనితరుణినేనంటాడు ॥యె ॥ యింటివారి నిజాస్తి కంటునాకంటాడు యితరపాలుజాస్తె యికయికాలంటాడు - వుంటిశెయ్యామీద వైరిగుందునంటాడు జంటగల్గిననాకు తంటవద్దంటాడు ॥ యె ॥ కాలాంతముననేను కలిగుందునంటాడు కాలకాలంబులలో కలియబోనంటాడు - తాలుమాటలునాకు తగదుపొమ్మంటాడు చాలసంసారమున జాలిపడుచుంటాడు ॥ యె ॥ ప్రావుగాపోలూరి ...గురుడంటాడు పాపపుణ్యంబుల బడయబోనంటాడు - తాపత్రయాధులను తొలగించునంటాడు - యేపట్లచూచినను యేకమైయుంటాడు ॥ యెక్కడనుండొచ్చె ॥

## 18. మంగళహారతులు.

మంగళంబనుచుబల్కరే • అంగానలార మంగళంబనుచుబల్కరే - మంగళంబనుచుమంచి యింగితామునెరిగినట్టి - అంగనామణులుగూడి - సంగరహితునాకునిపుడు ॥ మంగ ॥ నాదమినుచు ...నాదమందరే - నిశ్చలాలగుచూ వాదమెల్ల వదలియుండరే -

భేదమార్గములు లేక - ఆదిఅంత్యములుగాక - భేదమింతలేనివా ని - పాదములెలసినతు శిల్ల ॥ మంగ ॥ చెప్పనలవిగానిదెవుగరే - కంఠాలూరి అప్ప గురుని చేరికొలువరే - గొప్పకొంచమనగరాక - యప్పుడొక్క రీతిగాను - వప్పుతప్పు లేనిదాని రెప్పపాటు లోనదెలసి ॥ మంగ ॥ యన్నరాకయున్నదానినీ - గనుగొన్నవారీ - సన్నిధీలో యున్నవారినీ । యన్నటికిమరువబోకు - మిన్నుమన్ను కవలంబవల- యున్నదానిదెలసిజగము లున్నవనెటిభ్రాంతివిడచి ॥ మంగ ॥ హద్దు మీరి తిరుగబోకురే - పెద్దలసేవ ముద్దుగాను జేసినిల్వరే - ప్రొద్దునా నులేచిగురుని వద్దజేరివారివాక్కు - సుద్దులెల్లవినుచుమీలో కొ ద్దిగుణములెల్లమాని ॥ మంగ ॥ పరమపదము బయలుననుచునా - శిరమునను తనదు కరమునిలిపి స్థిరముజేసినా - పరుశురామ నరస గురుని - చరణములకు మొక్కినట్టి - ధరణీపాపయాఖ్యుడాది - పర మభక్తులెల్లగూడి ॥ మంగళం ॥

## 19. మంగళహారతులు.

గురురాజాచెందూ్రకు మంగళం - సద్గురురాయునకు శు భామంగళం ॥ అంగాంగాములయందూ భంగామూగాకానూ - గంగాయమునల నడుమ సంగూడై యున్నా శ్రీ ॥ గురు ॥ వేదాశా స్త్రంబూలూ వాదామూలేలానీ - ఆదీఅంత్యములేని అచలాముదెలి పీనా ॥ గురు ॥ పారావారములేనీ పరిపూర్ణా మెరిగించీ - సారా మూలేనీ సంసారాబ్ధీదాటించే । గురు ॥ వాసిగాపూర్వామూ వ్యాసా వాల్మీకూలూ - చేశీనాగ్రంధాలూ చర్చాలూననివల్కె ॥ గురు ॥ వట్టిప్రాపంచామూ బట్టాబయులందూనా - పుట్టాలేదనుచూనూ - బోధింపూచున్నట్టీ ॥ గురు ॥ వరుసాగాపోలూరీ వరపాపాయోగీకీ - యెరుకామరుపులేని పరవస్తూవెరిగించె ॥ గురురాజా ॥



